## శరీరము

శరీరము అంటే మనకు కనిపించే యీ భౌతిక శరీరము ఒక్కటే కాదు. శరీరములు మూడు రకములు ; అవి భౌతిక శరీరము, సూక్ష్మ శరీరము మరియు కారణ శరీరము. భౌతిక శరీరము ఆకృతి కలిగియుండి జననం నుండి అభివృద్ధి చెందుతూ యవ్వనంతో తొణికిసలాడి చివరికి వృద్ధాప్యంలో కృశించి మరణంతో నశించి పోతుంది. సూక్ష్మశరీరము ఆకృతిలేక ప్రయాణము చేస్తూ నిద్రలో,కలలో, ఊహలలో వివిధ అనుభూతులను పొందుతూ మనం చేసిన కర్మలకు శిక్షలను కూడా పొందుతుంది. ప్రాణం పోయిన తరువాత 11 (పదకొండు) దినములు ఆ పరిసరములలోనే చరించి తరువాత నశించిపోతుంది. మరణానంతరము కర్మలను ఆచరించకపోయిన శాశ్వతంగా ఆ పరిసరములలోనే ఉండిపోవును. కారణశరీరము భగవంతునితో సాన్నిహిత్యం కలిగి మనలను ఆ మార్గాన పయనింపచేస్తుంది. దైవసాన్నిధ్యానికి తీసుకొని వెళ్ళగలిగేది యీ కారణశరీరమే. ప్రాణంపోయినతరువాత ముందుజన్మలో మనం చేసుకున్న కర్మల ననుసరించి సరిగ్గా సంవత్సరమునకు తిరిగి జన్మను పొందుతుంది. అయితే మనం చేసుకున్న కర్మలనుబట్టి జన్మల సంఖ్య తగ్గి దైవసాన్నిధ్యానికి చేరుకుంటాము. మన గమ్యం అదే.  మనకు, దైవ సాన్నిధ్యానికి గల నిర్ణీతమైన దూరం ఒక్కొక్క జన్మలో మనం చేసుకున్న కర్మలను బట్టి పాపములు యెక్కువయితే దూరం యెక్కువవుతూ, హీనజన్మలను పొందుతూ,  పుణ్యము యెక్కువయితే ఆ దూరం తగ్గుతూ గౌరవమయిన, ఉత్తమమయిన జన్మను పొందుతాము. ఆ విధంగా అతి హీనమయిన క్రిమికీటకాదులు, పశుపక్ష్యాదులు, క్రూరమృగములు, సరీసృపములు, జలచరములు, వాన, నరజన్మలను వరుసగా పొందుతూ మానవజన్మ ఒక మజిలీగా ఉండి ఆ జన్మలో మనం చేసుకున్న పుణ్యం ఉంటే తిరిగి ఉత్తమమయిన మానవ జన్మను పొందుతూ గమ్యానికి దగ్గఅవుతాము పాపములు యెక్కువయితే మానవజన్మలోనే అతిహీనమయిన జన్మములు పొందుతూ గమ్యానికి దూరమవుతాము. ఆ విధంగా ఏడు (7) సార్లు మానవజన్మలు పొందుతాము ఇంకా పాపములు యెక్కువయితే నరజన్మలకు ముందున్న హీనజన్మములను పొందుతూ కోట్లకొలది జన్మలతోనే అతిహీనంగా బ్రతుకుతాము. కాబట్టి ఎన్నరాని జన్మలలో ఎన్నికైన ఉత్తమమయిన మానవజన్మ నెత్తిన మనం మనసా వాచా పైన పేర్కొన్న మూడురకాల శరీరాలూ యేకం కాగా భగవంతుని స్మరిస్తే ఆయనలో విలీనం అవుతాము.